సాధన గ్రంథమండలి, 66

# ఉపన్యాస రామాయణము

( చిత్రకూట సమావేశము )

మూలము :

రైట్ ఆనరబుల్ వి. యస్. శ్రీనివాసశాస్త్రి

అనువాదము :

శ్రీ పుచ్చా వేంకట్రామయ్య
సుప్రసిద్ధ ప్రకృతి వైద్యులు





ప్రకాశకులు
సాధన గ్రంథ మండలి, తెనాలి.

 1957 [వెల 0-4-0

# నివేదన

వాల్మీకి ఆదర్శకవి. రామాయణము ఆదికావ్యము. శ్రీరాముడు సాక్షాత్పరాత్పరుడు. ఆదర్శ పురుషపుంగవుడు. అట్టి మహాపురుషుని చరిత్ర వాల్మీకి అమృతలేఖిని నుండి జాలువారినది. శ్రీమద్రామాయణకథ ఆబాలగోపాలమునకు తెలుసు. శ్రీరాముని చరిత్ర పండితులు మొదలు పామరుల వరకు ఆప్యాయముతో శ్రవణము చేయుదురు. శ్రీమద్రామాయణమును కవులు, గాయకులు బహుముఖముల గానము చేసిరి. వారివారి బుద్ధికుశలతనుబట్టి కవితాగానమున స్వైర విహారము చేసినది రామాయణము. ఎవరెంత చెప్పినను నూతనాంశము పొడగట్టుచునేయుండును.

శ్రీరామునిలోని ఉదాత్తగుణములు ఆదర్శప్రాయములు, ఆచరణయోగ్యములు. శ్రీరాముని బోధలు వేదాంత సూత్రములు. ఇతరుల మనసు నోవకుండగ చక్కగ బోధించుటలో అతనికి అతడే సాటి. 'కాంతాసమ్మితం కావ్యమ్' బహుముఖముల మానవ జీవితమును సంస్కరించుట కవసరమగు సూక్తులకు పెన్నిధి రామాయణము. 'రామవద్వర్తితవ్యం, నచ రావణవతు' అని జనశ్రుతి.

ఇంతవర కెచటను ప్రపంచ చరిత్రలో 'నాకక్కర లేదనిన, నాకక్కరలే'దని రాజ్యాధికారమును నిస్పృహతతో నిరాకరించిన అన్నదమ్ములు కాన్పింపరు- ఏభాషయందును ఇట్టి విచిత్రసంఘటన వివరించిన కావ్యములును గాన్పింపవు. ఈ ఘట్టము మనము వాల్మీకిరామాయణమున చూడగలము. ఈచిత్రము జూచుటకు అయోధ్యారాజ్యమునకు సంబంధించిన పౌరజానపదులు, మంత్రి సామంతులు, పండితులు, కర్మిష్ఠులు,

మునులు, ఋషులేగాక — దేవతలు యక్ష సిద్ధ గంధర్వ కిన్న రాదులును భూమికి దిగివచ్చిరి. వాల్మీకిమహర్షి తనకావ్యము నందు ఈభాగమును మిక్కిలి కౌశల్యముతో తీర్చిదిద్ది రచించెను. ఈవిధముగనే సామాన్యదృష్టికి గోచరముకాని విశేష సంఘటనలు రామాయణమున సర్వత్ర గలవు.

ఇట్టి యమూల్య విషయములను రైట్ ఆనరబుల్, శ్రీ వి.యస్. శ్రీనివాసశాస్త్రిగారు 1944 ఏప్రియల్ 5వ తేది మొదలు మద్రాసు సంస్కృత పరిషదధ్వర్యమున, సంస్కృత కళాశాల ఆవరణయందు ప్రతిబుధవారము సుప్రసిద్ధ పండిత ప్రకాండుల సమక్షమున శ్రీమద్వాల్మీకి రామాయణమును ప్రస్తుతించుచు 30 ఉపన్యాసముల ఆంగ్లమున నొసంగెను. వానిని సుప్రసిద్ధ ప్రకృతివైద్యులగు శ్రీ పుచ్చా వెంకట్రామయ్యగారు సలలితమగు భాషలో ననువదించిరి. ప్రస్తుత మీచిన్నపొత్తమున చిత్రకూటమున శ్రీరామ భరతుల సమాగమ – సంవాదరూపమగు 10వ ఉపన్యాసము ముద్రించుచుంటిమి. దీనివలన శ్రీ శ్రీనివాసశాస్త్రిగారి రామాయణోపన్యాసములలోని విశేషము పాఠకులకు తెలియును. శ్రీ శాస్త్రి గారి రామాయణోపన్యాసములే ఈ 'ఉపన్యాస రామాయణము'. ఈ గ్రంథము మా గ్రంథమండలిలో ప్రచురించుటకు అంగీకరించి సహకరించిన శ్రీ వెంకట్రామయ్యగారికి మా కృతజ్ఞతాపూర్వక ధన్యవాదములు. ఈ గ్రంథ ముద్రణకు ఉదారులు సహకరించి మాయీకృషికి తోడ్పడగోరుచుంటిమి.

ఈ ఉపన్యాసరామాయణమందలి 30 ఉపన్యాసముల నామములు ఈక్రింద పొందుపరచుచుంటిమి. 1 పీఠిక, 2 బాల

కాండకథ, 3-4 లక్ష్మణస్వామి కైంకర్యవైభవము, 5-12 శ్రీరాముని గురించి. 9 శ్రీరాముని అనంత కల్యాణగుణముల పరామర్శ. 10 శ్రీరామ భరతుల చిత్రకూట సమావేశము, 11 వాలివధ-ధర్మాధర్మచర్చ, 12 సీతాపరిత్యాగ పరామర్శ, 13 భరతుని చరిత్ర, 14 సుగ్రీవుని చరిత్ర, 15-17 విభీషణుని శీలపరిశీలన, 18-21 హనుమంతుని దాసవైభవము, 12-24 రావణ విభవ పరాక్రమ శీలాదుల పరామర్శ, 25-27 సీతా మహాదేవి చరిత్ర ప్రస్తుతియు, 28 కైకయొక్క పవిత్ర హృదయ పరిశీలనము, 29 కౌసల్యాసుమిత్రల పవిత్రచరిత్రలు, 30 శ్రీరామునకు భరతుడు పాదుకలను సమర్పించుటయు, శ్రీరామపట్టాభిషేక వివరము, సింహావలోకనములును గలవు.

పై 30 ఉపన్యాసములు శ్రీ పుచ్చా వెంకట్రామయ్య గారు 1957 ఆగష్టు 4వ తేదీనుండి, ప్రతి ఆదివారము గుంటూరులో శ్రీ రామనామ క్షేత్రమున శ్రీకోదండరామ స్వామివారి సన్నిధిలో ప్రవచనము చేసియుండిరి.

ఈ 30 ఉపన్యాసములు క్రౌన్ ⅛ సైజున మూడు సంపుటము లగును. సంపుటము 1కి రు 2-8-0. ముందుగా తమ పేరు రిజిష్టరు చేసుకొనువారికి పోస్టేజి మేమే భరించి గ్రంథములు మీకందచేయగలము.

హేమలంబి
మార్గశిరము

వినీతుడు,
బులుసు సూర్యప్రకాశశాస్త్రి

---

వలయువారు:- 1. సాధన గ్రంథ మండలి, తెనాలి.
2. పుచ్చా వెంకట్రామయ్య, దంతలూరు అగ్రహారం.
పిడపర్రు పోస్టు - గుంటూరుజిల్లా



వామే భూమిసుతా పురశ్చ హనుమాన్

పశ్చాత్సుమిత్రా సుతః

శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో

ర్వాయ్వాదికోణేషుచ,

సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్

తారాసుతో జాంబవాన్

మధ్యే నీలసరోజముకుళం రామం

భజే శ్యామలమ్॥

శ్రీరామాయనమః.

# ఉపన్యాస రామాయణము

## 10. చిత్రకూట సమావేశము

చిత్రకూట పర్వతమున శ్రీరామ భరతులు ఒక విషయమును గురించి ఉన్నతస్థాయిలో చర్చించిరి. ఆ సంవాదమును వినుటకు దేవతలు సైతము దిగివచ్చిరి. కవి యిందు తన సామర్థ్యము నంతను చూపెను. ఇందుకు సంబంధించిన రామాయణములోని సర్గలు విమర్శనాదృష్టితో పఠించుట శ్రేయస్కరము. దేవతలు ఏలాభము పొందుట కా చర్చలు వినిరో, ఆ లాభము మనకుగూడ లభించును. అయోధ్యకాండలో నిందుకు సంబంధించినవి 100 మొదలు 112 వరకు గల సర్గలు. అందు మొదటి 3 సర్గలును చర్చకు సంబంధించినవి కావు. అందువలన వానిని వదలివేసెదను. మూడవసర్గ చివర వారి సమావేశము చెప్పుటలో కవి విచిత్రముగ శత్రుఘ్నుని పేరు వదలివేసెను.

శ్లో॥ స రాఘవ స్సత్యధృతిశ్చ లక్ష్మణో
మహానుభావో భరతశ్చ ధార్మికః,
వృతాః సుహృద్భిశ్చ విరేజు రధ్వరే
యథా సదస్యై స్సహితా స్త్రయోఽగ్నయః।

— అయోధ్య 103-32

యజ్ఞమునందు సదస్యులమధ్య త్రేతాగ్నులు జ్వలించునట్లు, సహృదయులగు సదస్యులమధ్య సత్యధృతియైన రాముడును, మహానుభావుడైన లక్ష్మణుడును, ధార్మికుడైన భరతుడును విరాజిల్లిరి.

అగ్నులు గూడ మూడేకదా! శత్రుఘ్నుని పేరందువలన చేర్చలేదేమో. లేదా ఈ సందర్భములో శత్రుఘ్నుడు అనవసరమని యైనను వదలివేయవచ్చును. ఇది ఆశ్చర్యకరముగనే యున్నది. దశరథుని శ్రాద్ధక్రియ లైపోయినవి. అప్పుడు రాముడు "సపరివారముగ నీవీ యరణ్యమున కేల వచ్చితివి?" అని భరతుని ప్రశ్నించెను. భరతునివెంట పౌరజానపదులేగాక మంత్రులు, సామంతులు, దశరథుని పత్నులైన కౌసల్యా కైకేయీసుమిత్రలుకూడ వచ్చిరి. "ఈ అపారమగు సేనదేనికి? ఈ లక్షలాది జనముల నేల తెచ్చితివి?" అని రాముడనెను. ఈ స్వల్ప వివాదమునకే భరతుడొక వాగ్యుద్ధమును చేసెను. భరతుడు ముఖ్యముగ మూడు సంగతులను చెప్పెను. ఇక్ష్వాకువంశములో ఎడతెగకుండగా వచ్చుచున్న ఆచార మేమనగ తండ్రికి పెద్దకొడుకగువాడు రాజ్యమేలవలెను. రెండవది తన తల్లి అక్రమముగ తన కోర్కెను నెరవేర్చుకొనుట. తన తల్లివలన సంపాదింపబడిన లాభమును రద్దుచేయుట. అనగా తానా లాభమును పొందకుండుట. మూడవది రాజ్యమునందలి ప్రజలెల్లరును, రామునే తమ రాజుగ వరించుట. రాముని వెంటనే అయోధ్యకువచ్చి రాజ్య స్వీకారము చేయవలెనని వారు కోరుట. ఇందుకు సంబంధించిన శ్లోకములను చూడుడు.

శ్లో॥ త్వయా నియుక్తః కైకేయ్యా మమ మాత్రా పరంతప!,
చకార సుమహాత్పాప మిద మాత్మ యశోహరమ్॥
— అయోధ్య 104-6

"పరంతపుడవగు ఓ రామచంద్రా! స్త్రీయైన నాతల్లి యొక్క ప్రోత్సాహమున మనతండ్రి మహాపాపము నొనరించెను. దానివలననే నాకీర్తి యంతయు పాడయ్యెను."

శ్లో॥ సా రాజ్యఫల మప్రాప్య విధవా శోకకర్శితా,
పతిష్యతి మహాఘోరే నిరయే జననీ మమ॥
— అయోధ్య 104-7

ఈ పలుకులు సత్పుత్రుడగువాడు తనతల్లిని గురించి పలుకవలసినదేనా? కాని జరిగిన విషయము వలన భరతుని మనసునం దగ్నిరగులుకొన్నది. అత డోరిమిని కోల్పోయెను. తన తల్లినిగురించి తలచినపుడెల్ల వంశము యొక్కయు, తన యొక్కయు, తన తల్లియొక్కయు కీర్తి అంతయు పాడగుటయే గాక రాజ్య మరాజకమైనది అని యతనికి తోచును. కైకేయి తన కుమారునకు రాజ్యము కట్టపెట్టలేదు. తండ్రి మరణమువలన విధవయై శోకించుచున్నది. చేసిన యపరాధము వలన తనతల్లి ఘోరనరకమున పడవలసి యున్నది. ఈసంగతి అతనిని బాధించుచున్నది. ఇందువలననే ఆతడు కైకనుగురించి మాటాడినపుడెల్ల రామునితో కఠినముగనే మాట్లాడుచున్నాడు.

శ్లో॥ ఏభిశ్చ సచివైః సార్ధం శిరసా యాచితో మయా,
భ్రాతుః శిష్యస్య దాసస్య ప్రసాదం కర్తు మర్హసి॥
— అయోధ్య 104-12

ఇంతకన్న వినయముతో కూడిన ప్రార్థన యెట్లుండును? కాని రాముడు ఇట్టి మృదు మధుర వాక్యములచే చలించువాడు కాడు. సుపుత్రుడైనవాడు తన తల్లిని ఆవిధముగ నిందింప తగదనును. కైకేయి వర్తన శ్రీరామునకైన నచ్చలేదు. అయిననేమి? కుమారుడైనవాడు తల్లియొక్క వర్తనను అంతగ బయటపెట్టుట, అమితమగు దుర్భాషలతో నిందించుట భరతునివంటి ఉదాత్త వర్తనున కర్హము కాదని రాముని తలంపు.

'నచాపి జననీం బాల్యా త్త్వం విగర్హితు మర్హసి!

— అయోధ్య 104-17

"నీవు బాలుడవు. తల్లిపై ఓర్మిని కోల్పోయి కోపము తెచ్చుకొనుట తగ" దనును. అంతేగాక తల్లియును తండ్రి వలెనే బిడ్డల నాజ్ఞాపింపదగునని రాముని నిశ్చయము.

శ్లో॥ యావత్పితరి ధర్మజ్ఞే గౌరవం లోకసత్కృతే
తావద్ధర్మ భృతాం శ్రేష్ఠ! జనన్యా మపి గౌరవమ్,

ఏతాభ్యాం ధర్మశీలాభ్యాం వనం గచ్ఛేతి రాఘవ,
మాతాపితృభ్యా ముక్తోఽహం కథ మన్య త్సమాచరే॥

— అయోధ్య 104-21-22

"ధర్మశీలురైన మన తలిదండ్రులు నన్ను పదునాలుగేండ్లు వనవాస మొనర్పు మని యాజ్ఞాపించిరి. నేనెట్లు వారి యాజ్ఞ నుల్లంఘింపగలను" అని రాముడనును. ఇచ్చోట దశరథునితోపాటు కైకేయిని చేర్చియే వారుభయులు

'ధర్మశీలు'రనియే రాముడు పలుకును. అంతేకాదు వారిద్దరిలో నెవరును తప్పుచేయలేదని మున్ముందు చెప్పబోవుచున్నాడు. కైకనుగురించి కొంత సమర్థించుట అవసరమని రామునకు తోచియుండవచ్చును. అందువలననే ఆత డిట్లు చెప్పగలుగుచున్నాడు. అయినను కైక చేసిన దేమున్నది? తాను పొందిన వరముల ప్రసాదింపు మనెను. అది తప్పా? తన భర్త యొకానొక కాలమున వరప్రదానము చేసెను. అప్పుడామె వానిని ఉపయోగించుకొనలేదు. వానినిపుడు కోరుకొనుటలో తప్పేమున్నది? ఆమె ఆ వరములను నొక చెడ్డపనికై వినియోగించె ననునదియే ప్రవాదముగామారినది. ఏమయినను తనకు తగనివానిని నామె కోరుకొనలేదు. అదియుగాక, అయోధ్యనుండి బయలుదేరుటకు ముందుగాని తరువాతగాని రాజ్యత్యాగముగాని వనవాసముగాని రాముని మనసునం దెట్టిమార్పును కలిగింపలేదు. మోహావశులైన ఇతరులకు కాన్పించునంత భయంకరముగ నిశ్చలుడైన రామచంద్రునకవి గోచరింపలేదు. అంతేకాదు, జీవితములో నెట్టి మార్పు వచ్చినను అతడు చలింపడు. అందువలననే రాముడు దశరథుని, కైకను కూడ ధర్మశీలురనియే బుద్ధిపూర్వకముగ పేర్కొనెను. ''నేనిందుకు అభ్యంతరము చెప్పను. కైక తనకు రాదగిన దానినే స్వీకరించెను. ఆమెకు ఒక్కడే కుమారుడు. తల్లి తనకు వచ్చినదానిని కొడుకునకు సంక్రమింపచేయుట సహజమేకదా! మన తండ్రియైనను ఇప్పుడు దేనిని ఎవరికిని అన్యాయముగ కట్టిపెట్టలేదు. ఒకప్పుడు తానిచ్చిన వరమునే ఇప్పుడు తప్పుకొనుటకు వీలుగాక సత్యవాక్పరిపాలనకై

ఇచ్చివేసెను" అని రాముడనెను. ఆ చిన్నవాదముతో నారాత్రి గడచిపోయెను.

మరునాడుదయము కాల్యకృత్యములైన తరువాత సనుష్ఠానములు తీర్చుకొని వారు తిరిగి సమావేశమైరి. భరతుని కోరిక ప్రకారము రాముని రాజ్యస్వీకారము జరుగునా? లేదా? అను సంశయముతోను, ఆశతోను, అయోధ్యాపురవాసులును, తత్కాంగల పరివారమును సమావిష్టులైరి. భరతుడిట్లు తనవాదము నారంభించెను. "రామచంద్రా! నీ వనినట్లు మన తండ్రి దశరథుని వద్దనుండి కుమారుడనైన నాకిచ్చుటకునై క రాజ్యము తీసికొనెను. ఆమె నాకొసంగెను. అది యట్లే యుండనిమ్ము. స్వీకరించిన రాజ్యమునకు నేనిపు డధిపతిని. ఆ రాజ్యమును నేనే స్వయముగ నీకొసంగుచున్నాను. దీనిని నీవు స్వీకరింపుము" అనెను.

శ్లో॥ సాంత్వితా మామికా మాతా దత్తం రాజ్యమిదంమమ,
తద్దదామి తవైవాహం భుజ్క్ష్వ రాజ్య మకంటకమ్॥

— అయోధ్య 105-4

ఇందుకు రాముడు ఇంకొక విధముగ వివరింప నారంభించెను.

"సోదరా! కాలము, విధి అనునవి కలవు. కాలము మనలను వేరువేరు పనులయందు నియోగించెను. తదనుగుణముగ మనము వర్తింపవలసి యున్నాము. ఈవిధాన మింతకు ముందే విధింపబడినది. ఇప్పుడు దానిని మార్చుట కధికారము మనకులేదు." ఇందుకు సంబంధించిన శాస్త్రప్రమాణములు

పూర్వగ్రంథముల నుండి 16 శ్లోకములలో చెప్పియున్నారు. అందులో కొన్ని అతిసామాన్యముగకూడ గోచరింపవచ్చును. ఒకసంగతి మనము జ్ఞాపకముంచుకొనవలెను. ఇందలి వాక్యములు లక్షలాది సమయములందు ఉద్గ్రంథములలో గోచరించునవియే. వీనిని అనేకులు ఉత్తమ పురుషులు, అధమాధములు కూడ నోట వచింపగ మనము వినియున్నాము. పండితులు వానిని గురించియు నుపన్యసించి యుండిరి. అనేక పర్యాయములు వినియుండుటచేత వానితో మన కతిపరిచయమేర్పడి వానియందు శ్రద్ధ తగ్గిపోయినది. అవజ్ఞత ఏర్పడినది. కాని రాముని కాలములో ఆ వాక్యములయందు సమాదరణ యుండవచ్చును. శ్రీరాముని ముఖతః వచ్చిన ఆవాక్యములు అర్థవంతములు, ఆదర్శప్రాయములు. ఇందు చాల శ్లోకములు మీ రిదివరకే అనేక పర్యాయములు వినియుండవచ్చును. అందు కొన్నింటిని మాత్ర మీ క్రింద పొందుపరచుచుంటిని. అవి చాల సుప్రసిద్ధములు.

శ్లో॥ సర్వే క్షయాన్తా నిచయాః పతనాన్తాః సముచ్ఛ్రయాః,
సంయోగా విప్రయోగాన్తా మరణాన్తం చ జీవితమ్॥

— అయోధ్య 105-16

కూర్చిన ధనసంచయములు నాశనమందక మానవు. పొందిన ఔన్నత్యమును పతనమంద వలసినదే. కలసినవారి కెప్పటికైనను వియోగము తప్పదు. జన్మించినవా రెప్పటికైన మరణింపక తప్పదు.

శ్లో॥ యథా ఫలానాం పక్వానాం నాన్యత్ర పతనా ద్భయమ్,
ఏవం నరస్య జాతస్య నాన్యత్ర మరణా ద్భయమ్॥
— అయోధ్య 105-17

పండిన పండ్లు నేలరాలునట్లే జన్మించిన మానవుడు మరణింపక తప్పదు. వాని కదే భయకారణము.

శ్లో॥ యథాఽగారం దృఢ స్థూణం జీర్ణం భూత్వాఽవసీదతి,
తథా వసీద న్తి నరా జరామృత్యు వశం గతాః॥
— అయోధ్య 105-18

ఎంతో దృఢముగ కట్టిన ఇండ్లు కాలక్రమమున శిథిలమై నేలకూలినట్లే నరులుకూడ జరామరణముల పాలు గాక తప్పదు.

శ్లో॥ అత్యేతి రజనీ యాతు సా న ప్రతినివర్త తే,
యాత్యేవ యమునా పూర్ణా సముద్రం లవణార్ణవమ్॥
— అయోధ్య 105-19

గడచిన ఆరాత్రి తిరిగి రాదు. యమున తనజలములను లవణార్ణవమందు వదలివేయును. ఆనీరు తిరిగి ఎప్పుడును, ఆనది వెంట పైకిరాదు.

శ్లో॥ అహోరాత్రాణి గచ్ఛ న్తి సర్వేషాం ప్రాణినా మిహ,
ఆయూంషి క్షపయ న్త్యాశు గ్రీష్మే జలమివాంశవః॥
— అయోధ్య 105-20

వేసవియందు జలములను సూర్యు డింకించి వేసినట్లు ఈభూమి యందలి జీవరాసుల జీవితములను దివారాత్రములు హరించి వేయుచున్నవి.

శ్లో॥ ఆత్మాన మనుశోచత్వం కి మన్య మనుశోచసి,
ఆయుస్తే హీయతే యస్య స్థితస్య చ గతస్య చ॥
— అయోధ్య 105_21

నిలచినను, కదలినను నీఆయువు క్షీణించుచున్నది. దానిని గురించి ఆలోచింపుము. మిగిలినవాటిని గురించి యేల విచారించెదవు?

శ్లో॥ సహైవ మృత్యు ర్వ్రజతి సహమృత్యు ర్నిషీదతి,
గత్వా సుదీర్ఘ మధ్వానం సహమృత్యు ర్నివర్తతే॥
— అయోధ్య 106_22

నీవు పయనింతువా, నీతోడనే మృత్యువు పయనించును. నీతోడనే యెంతదూరమైనను సాగివచ్చును. పోయి తిరిగివచ్చినయెడల అది నీవెనువెంటనే తిరిగివచ్చును.

శ్లో॥ గాత్రేషు వళయః ప్రాప్తాః శ్వేతాశ్చైవ శిరోరుహాః,
జరయా పురుషోజీర్ణః కిం హి కృత్వా ప్రభావయేత్॥
— అయోధ్య 105_38

చర్మము ముడతలుపడి చుట్టలు చుట్టుకొనిపోవుచున్నది. కేశములు తెల్లబడుచున్నవి. వార్ధక్యము మానవుని ధ్వంసము చేయుచున్నది. మానవుడు దీని కేమి ప్రతిక్రియ చేయగలడు?

శ్లో॥ నన్ద న్త్యుదిత ఆదిత్యే నన్ద న్త్యస్తమితే రవౌ,
ఆత్మనో నావ బుధ్యన్తే మనుష్యా జీవితక్షయమ్॥
హృష్య న్త్యృతుముఖం దృష్ట్వా నవం నవ మిహాగతమ్,
ఋతూనాం పరివర్తేన ప్రాణినాం ప్రాణసంక్షయః॥
— అయోధ్య 105-24, 25

సూర్యోదయా స్తమానములు చూచి, మానవులు సంతసించుచున్నారు. కాని తమ ఆయువు క్షీణించుట తెలిసికొనుట లేదు. అట్లే ఋతువులు వచ్చినపుడు గూడ నూతనత్వము, ఆనందమును అనుభవించుచున్నారు. కాని ఋతు భ్రమణమునందు తమ ఆయువు క్షీణించుటను తెలిసికొన లేకున్నారు.

శ్లో॥ యథా కాష్ఠం చ కాష్ఠం చ సమేయాతాం మహార్ణవే,
సమేత్య చ వ్యపేయాతాం కాల మాసద్య కంచన॥
ఏవం భార్యాశ్చ పుత్రాశ్చ జ్ఞాతయశ్చ ధనాని చ,
సమేత్య వ్యవధావన్తి ధ్రువో హ్యేషాం వినా భవః॥
నాత్ర కశ్చి ద్యథా భావం ప్రాణీ సమభివర్తతే।
తేన తస్మి న్న సామర్థ్యం ప్రేతస్యాస్త్యనుశోచితః॥

— అయోధ్య 105-26-27-28

సముద్రముమీద రెండుకట్టెలు ఒకదానితో నొకటి కలసి కొంతదూరము తోడుగ పయనించెను. తరువాత విడిపోయెను. అట్లే భార్యాపుత్రులు, జ్ఞాతులు, సంపదలు కొంతదూరము తోడుగనుండి తరువాత విడిపోవుదురు. దీనిని తప్పించుట సాధ్యముకాదు. సహజమైన ధర్మముల నెవరును మీరజాలరు. మరణించినవారికొరకై దుఃఖితురు. కాని ఎవడును మరణమును తప్పించుకొనజాలరు.

శ్లో॥ యథాహి సార్థం గచ్ఛన్తం బ్రూయాత్కశ్చి త్పథిస్థితః,
అహ మప్యాగమిష్యామి పృష్ఠతో భవతా మితి॥

ఏవం పూర్వై ర్గతో మార్గః పితృపైతామహో ధ్రువః,
త మాపన్నః కథం శోచే ద్యస్య నాస్తి వ్యతిక్రమః॥
— అయోధ్య 105-29-30

బాటసారులవెంట బోవువాడు నేనుకూడ వచ్చు చున్నా ననును. ఆవిధముగనే పితృపితామహులు గతించు చుండగా మనమును వారివెంటనే గతించుచున్నాము. అతిక్ర మించుటకు వీలుగాని యీనియమమును గురించి విచారించుట (వ్యర్థము) యెట్లు?

శ్లో॥ వయసః పతమానస్య స్రోతసో వా నివ ర్తినః,
ఆత్మా సుఖే నియోక్తవ్య స్సుఖభాజః ప్రజాః స్మృతాః॥
— అయోధ్య 105-31

నదివెంట సముద్రమునకుపోయిన నీరు త్రోవవెంట తిరిగి రానట్లే, మానవుని ఆయువుకూడ తగ్గుచుండునేగాని వృద్ధి పొందదుగనుక సుఖముకోరు మానవులు సుఖప్రదమైన ధర్మమార్గముననే అవలంబింపవలెను. ఈ విధముగ రాముడు 105 వ సర్గ చివరివరకును ప్రసంగించెను.

ఇంతలో ఆరవసర్గ ఆరంభమగును. ఈ సర్గలో రాముడు భరతుడును ప్రసంగింతురు. ప్రసంగము చివరివర కును వారన్యోన్యముగ మన్నించుకొనుచుండిరి. ఒకరి ప్రసంగ మైనతరువాత రెండవవారు "నీవు మాట్లాడినది బాగున్నది. నీవు వాక్చాతుర్యము కలవాడవు" అని పరస్పరము అనుకొను చుండిరి. మరల వారి వివాద మారంభమయ్యెను. రాముని బోధలు బాగున్నవని భరతుడు స్తుతించెను. కాని భరతుడు

తన వాదమును వదలుకొనలేదు. ఆరంభమున భరతుడు కైకను నిందించును. "అన్నా! నా సుఖమునకై మాతల్లియైన కైక అవరమును కోరెను. అప్పుడు నేను లేనుకదా!

శ్లో॥ ప్రోషితే మయి యత్పాపం మాత్రా మత్కారణాత్కృతమ్,
క్షుద్రయా తదనిష్టం మే ప్రసీదతు భవాన్ మమ॥

శ్లో॥ ధర్మబంధేన బద్ధోఽస్మి తేనేమాం నేహ మాతరమ్,
హన్మి తీవ్రేణ దండేన దండార్హాం పాపకారిణీమ్॥

— అయోధ్య 106-9, 10

ఈమెను ఇప్పుడిక్కడ తీవ్రదండముతో చంపుదును. కాని నేను ధర్మబద్ధుడ నగుటవలన నట్లుచేయుటకు భయపడుచున్నాను." అంతకుముం దొకమారు భరతుడిట్లు చెప్పియుండెను. "నేను నీ యసమ్మతికి భయపడుచున్నాను. మనతండ్రి దశరథుడు స్త్రీలోలుడు. ఆతడు నా తల్లి చేతిలో పడెను. అంతేగాక—

'అన్తకాలే హి భూతాని ముహ్యన్తీతి పురాశ్రుతిః'

— అయోధ్య 106-13

వృద్ధాప్యమున మోహమావరించును అని చెప్పెదరు. ఈ సంగతియే మనతండ్రియందు సార్థకమైనది.

'రాజ్ఞైవం కుర్వతా లోకే ప్రత్యక్షం సా శ్రుతిఃకృతా'

— అయోధ్య 106-14

అనిచెప్పి భరతుడు తన అన్నకే ఉపదేశము చేయబోవుచున్నాడు.

'అపత్యః' అను పదము నపుంసకలింగము. కుమారుడని యర్థము. తండ్రిని పతనముల నుండి రక్షించువాడు. 'పత్యం' అనగా పతనము 'అ' లేనివాడు. అనగ తండ్రిని పతనమునుండి కాపాడగలవాడని అర్థము.

శ్లో॥ సాధ్వర్థ మభిసంధాయ క్రోధాన్ మోహాచ్చసాహసాత్,
తాతస్య యదని క్రాంతం ప్రత్యాహరతు తద్భవాన్॥
— అయోధ్య 106-14-15

మన తండ్రి మోహమువలననుగాని, భార్యకు కోపము వచ్చునను భయమువలననుగాని ఒక అక్రమ శాసనము చేసెను. చేసినదానిని నీవు సరిదిద్దవలసినవాడవు.

శ్లో॥ పితుర్హి స మతిక్రాంతం పుత్రో యః సాధు మన్యతే॥
— అయోధ్య 106-15

తండ్రిచేసిన తప్పును సరిదిద్దువాడే పుత్రుడు అనబడును.

'తదపత్యం మతం లోకే విపరీత మతోఽన్యథా'
— అయోధ్య 106-16

తండ్రిచేసిన తప్పుపనిని సరిదిద్దక ఆతప్పు ఆజ్ఞను పాలించువా డపత్యుడనబడడు. అతడు తండ్రియొక్క పతనమునకు సహాయ పడును కనుక నీవపత్యుడవుకమ్ము.

'మా భవాన్ దుష్కృతం పితుః' — అయోధ్య 106-16

తండ్రియొక్క చెడ్డశాసనము ననుసరింపకుము. ఆతడు చేసిన తప్పునే నీవుకూడ బలపరచిన యెడల నతడు నరకమును పొందును, నీవు దానిని సరిదిద్ది అతనిని రక్షింపుము.''

తెలివిగలవారు ఎదిరి వాదమును తమ కనుకూలముగ స్వీకరింతురు. సామాన్యముగ రామాయణము చదువువారు ఈవిషయమును గుర్తింపరు. సామాన్యముగనని నేననుటకు కారణము నాకొక్కనికే తెలియునని చెప్పుటకు కాదు. మరి యేమనగా కొద్దిమంది మాత్రమే ఇందలి రహస్యమును గుర్తింప గలరు. అయోధ్యాకాండలో మొదటనే ఒకప్రశ్న ఉద్భవించినది. దశరథుని నిజమైన వాంఛను రాముడు క్రమముగ నిర్వర్తించుచున్నాడా లేదా ? రాముడు రాజవాంఛను నెరవేర్చుట లేదని నమ్మువారు చివరివరకును దాని నట్లే విశ్వసించిరి. వారు చెప్పునదేమనగ:- దశరథుడు మొదటనే రాముని యువరాజును చేయదలచెను. తదనుగుణ్యముగ రాముని పిలిచి అతనికి యౌవరాజ్యపదము నొసంగెదనని వాగ్దత్తము చేసెను. తరువాత నాతడు మంత్రి, సామంత, పురోహిత, జానపదులను విజ్ఞానధనులను సమావేశపరచి ఆ బృహత్సభయందు వారి సమక్షమున శ్రీరాముని యౌవ రాజ్యాభిషేకము గురించి ప్రస్తావించెను. సహజముగనే వారందరు రాముని పట్టాభిషేకమున కామోదించిరి. సంత సించిరి. అంతేకాక మహారాజు చేసిన పనులలోనెల్ల నీపట్టాభి షేకమే అతి శ్రేష్ఠమైనదనిరి. దీనితరువాతనే మంథరదుర్బోధ వలన కైక యెప్పుడో ఇచ్చి మరచిపోయిన వరముల గురించి రాజును వశపరచుకొనెను. కనుక నిది రెండవ వాగ్దానము. రామున కిచ్చినదే మొదటి వాగ్దానము. రాజు తానుచేసిన మొదటి వాగ్దానము నుల్లంఘించి రెండవ వాగ్దానమును చెల్లించెను. లక్ష్మణుడు, భరతుడు, తక్కుంగల అయోధ్యా

పురవాసులు చేయువాదమిది. రాజు తాను చేసిన రెండవ వాగ్దానమున కేల ప్రాధాన్య మొసంగెను?

నిజమునకు రాజు రామునకు చేసిన వాగ్దానమేమియు లేదు. రాముడుకాని పౌరులుకాని రాజువద్ద అట్టి వాగ్దానమును కోరియుండలేదు. అంతేగాక కైకకిచ్చినట్లు అది ప్రమాణము చేసి ఇచ్చిన వరమైనను కాదు. రాజు తాను రాజ్యభారమునంతను వహింపజాలక కొంతభార మతని కొసంగుటకై ఒక యేర్పాటు చేయ నెంచెను. ఆయేర్పాటునే ప్రజలకు తెలిపెను. అంతేకాని ఇందు ప్రమాణముమీాద చేసిన ప్రతిజ్ఞ యేమియు లేదు. అందువలన రాజును నిలువదీసి యీ ప్రతిజ్ఞ చెల్లింపుమని అడుగు నధికార మెవరికిని లేదు. కాని సామాన్యముగ ప్రజ లీదృష్టిని స్వీకరింపరు. ప్రజానురంజకుడైన రాముడు రాజు కావలెనని ప్రజలు కోరిరి. అందుకు భిన్నముగ కైకవరము వచ్చినది. రాముడరణ్యమునకు పోవలసివచ్చెను. ఇది ప్రజలకు ఇష్టము లేదు. అందుకే వారు చేయని వాగ్దానమును చేసినట్లే స్వీకరించి తదనుగుణ్యముగనే తమ వాదమే చెల్లవలెననియు రాముడు రాజ్యమేలవలెననియు కోరుచుండిరి.

రాముడీవిషయమును ఏదృష్టితో పరికించెనో చూతము. రాముడు ఈవిధముగ వాదించి యుండునని నేనభిప్రాయపడుచున్నాను "మనతండ్రి రెండు ప్రతిజ్ఞలను చేసెను. వానిలో నే నేప్రతిజ్ఞను నెరవేర్పవలెను? రాజు నారాజ్యవిషయమై చేసినది ప్రతిజ్ఞ యేకాదు. వాదముకొరకై నేను దానిని ప్రతిజ్ఞగనే స్వీకరించి రాజ్యమునకే సిద్ధమైనయెడల

ప్రజలు నన్నేమందురు? రామున కనుకూలముగ నున్నది గనుక నతడు కైకకిచ్చిన వరమును నిరాకరించి రాజ్యమునకు సిద్ధమయ్యేనని యనరా? అంతేగాక ధర్మమనునది నాదృష్టిలో భిన్నముగ నున్నది. రెండు విధులు నేను చేయవలసి యున్న యెడల త్యాగము, బాధ ఏవిధియందుండునో దానిని స్వీకరించుటయే ధర్మమని నాఉద్దేశ్యము. నిరర్థకమైన స్వార్థమునందు లోభినై స్వీకరింపవలసిన విధులు నేను ధర్మము కాదందును.

ఈ విధముగ రాముడు వాదించి యుండును. ఇందులో పొరపాటేమియు లేదని నేను నమ్ముచున్నాను. దానికి కారణము కలదు. భరతుడు రామునకు తోడబుట్టినవాడు. కొంత కాలము వారు వేరువేరుగ నుండినను తనదికూడ నట్టిహృదయమే యగుటవలన రామునిహృదయమును భరతుడెరుగును. అతనివలెనే సాహసౌదార్యగుణసంపన్నుడు. భరతుడుకూడ రామునివలెనే ఏది ధర్మమో చూచుకొని ప్రవర్తించుటయందే శ్రద్ధకలవాడు.

రామునితో నతడిట్లనెను. "నాకు నీ పద్ధతులు తెలియును. నీవు బాధనాహ్వానింతువు. నీవు త్యాగనిష్ఠుడవు. అందువలన త్యాగముచేయుట బాధననుభవించుటగల పనిని నీకు చూపెదను.

శ్లో॥ అథ క్లేశజ మేవత్వం ధర్మం చరితు మిచ్ఛసి,
ధర్మేణ చతురో వర్ణాన్ పాలయన్ క్లేశమాప్నుహి !

అయోధ్య 106-21-22.

ధర్మముగ చాతుర్వర్ణములను పాలించుట మిక్కిలి క్లేశముతో కూడినపని. ఈ కష్టపుపనిని నీవు స్వీకరింపుము. దానివలన నీ యోరిమికి వరిపిడి కలుగును. నిద్రలేని రాత్రుల గడుపవలసి వచ్చును. ఇదియెంతో త్యాగముతోకూడినపని కాన రాజ్యమును స్వీకరింపుము.

శ్లో॥ చతుర్ణా మాశ్రమాణాంహి గార్హస్థ్యం శ్రేష్ఠ మాశ్రమమ్,
ప్రాహు ర్ధర్మజ్ఞ ధర్మజ్ఞాః తం కథం త్యక్తు మర్హసి॥
— అయోధ్య 106- 22, 23.

నాలుగు ఆశ్రమములలోను గృహస్థాశ్రమము ఉత్తమ మైనదని ధర్మజ్ఞులు చెప్పుచున్నారు. నీవు ధర్మజ్ఞుడవు. గృహస్థాశ్రమము వదలుటకు ఏల ఉత్సాహ పడుచున్నావు. మరియు నిట్లనెను. ”

‘శ్రుతేన బాలః స్థానేన జన్మనా భవతో హ్యాహమ్’
— అయోధ్య 106-23

“నీతో పోల్చినపుడు నేను బాలుడను. స్థానముచేతను జన్మచేతను కూడ నీవు ఉత్తముడవు.”

‘హీనబుద్ధి గుణోబాలో హీనః స్థానేన చాప్యహమ్’
— అయోధ్య 106-24

రామునికన్నను భరతుడు కొన్నిగంటలు మాత్రమే చిన్నవాడైనను తనను బాలునిగనే చెప్పుకొనెను. అంతేకాక బుద్ధి చేతను, గుణము చేతను కూడ తాను తక్కువయే అనుచున్నాడు.

శ్లో॥ స కథం పాలయిష్యామి భూమిం భవతి తిష్ఠతి,
భవతా చ వినాభూతో న వర్తయితు ముత్సహే॥
— అయోధ్య 106-24, 25

నీవుండ నేనెట్లు రాజ్యమును స్వీకరింపగలను? ప్రజ లేమందురు? ఈభారమును నేనెట్లు భరింపగలను?

శ్లో॥ ఇహైవ త్వాభిషించంతు సర్వాః ప్రకృతయః సహ,
ఋత్విజః సవశిష్ఠాశ్చ మంత్రవన్ మంత్రకోవిదాః॥
— అయోధ్య 106-26, 27

నగరమునుండి పౌరజానపదుల నందరిని తీసికొనివచ్చిన వశిష్ఠులవా రిక్కడనే యున్నారు. అభిషేక సంభారముల నన్నియు తెచ్చియున్నారు. మనసైన్యము ఇచటనేయున్నది. మంత్రు లెల్లరును ఉన్నారు. మేళతాళము లున్నవి. నీ కిచ్చటనే పట్టాభిషేకము చేసెదను. ఇక నెవరు కావలెను? ఋత్విజు లిచట నున్నారు. వేదముల నామూలాగ్రముగ దెలిసిన పండితులున్నారు.”

కాని రాముడిందు కొప్పుకొనలేదు. ఆతడొకించుక యును మెత్తపడలేదు. ఆ సభయందున్న వారందరును, భరతుని మాటయే చెల్లుబడి కావలయుననియు ఎట్లైనను రాముడయోధ్యకువచ్చి రాజ్యమేలవలయుననియు కోరుచుండిరి. వాల్మీకిమహర్షి ఇచట సమావేశమైన వారందరకును రెండు విధములైన భావములున్నట్లు వర్ణించెను. రాముడు రాజ్యమును స్వీకరింపనందుకు దుఃఖమును రాముని దృఢమగు ధర్మనిష్ఠను గురించిన గౌరవముతోడ యానందమును పొందిరి.

ప్రజలు తాము నమ్మినదే ధర్మమనుకొనిరి. రాముడు చెప్పిన ధర్మపద్ధతి వారిదివరకూహింపరైరి. "మేమిదివరకు భరతుడే జయించి రాముడే రాజ్యమేలునని నమ్మియుంటిమి. ఇప్పుడు రాముని ధర్మబద్ధమైన వాదమెంత బాగున్నది,

శ్లో॥ త దద్భుతం స్థైర్య మవేక్ష్య రాఘవే
సమం జనో హర్ష మవాప దుఃఖితః,
నయాత్యయోధ్యా మితి దుఃఖితోఽభవ
స్థిరప్రతిజ్ఞత్వ మవేక్ష్య హర్షితః॥
— అయోధ్య 106-34

మనసులో రాముని ధర్మనిష్ఠయందు ప్రీతిగలవారయ్యు రాముని యందలి మోహమున వారు పైకిమాత్రము భరతునే బలపరచిరి.

తర్వాతి సర్గలో రాముడు భరతునితో నిట్లనెను. "నేను తండ్రికి పెద్దకుమారుడను కనుక నేనుమాత్రమే తండ్రి యాజ్ఞను నెరవేర్ప వలెననియు, నీవు నెరవేర్ప నక్కఱ లేదనియు తలంచుచున్నావా? తండ్రి నన్నరణ్యమునకు పొమ్మనెను. నిన్నయోధ్యలోనుండి రాజ్యమేలుమనెనుగదా! దానిని నీవెట్లుల్లంఘించెదవు? ఈసంగతి నీవు మరచిపోవు చున్నావు.

శ్లో॥ భవానపి తథేత్యేవ పితరం సత్యవాదినమ్,
కర్తు మర్హతి రాజేంద్ర! క్షిప్రమేవాభిషేచనాత్॥
— అయోధ్య 107-9

కాలమును వ్యర్థము చేయక నయోధ్యకు బోయి పట్టాభిషిక్తుడవై తండ్రియాజ్ఞను పాలించుము. నేను నట్లే నాకు విధించిన వనవాసము చేసెదను.

శ్లో॥ ఋణా న్మోచయ రాజానం మత్కృతే భరత ప్రభుమ్,
పితరం త్రాహి ధర్మజ్ఞం మాతరం చాభినన్దయ॥
— అయోధ్య 107-10

తండ్రి యాజ్ఞను పాలించి యతనిని ఋణవిముక్తునిచేసి రక్షించుము. దీనివలన మీతల్లియును సంతసించును.

శ్లో॥ శ్రూయతే హి పురా తాత! శ్రుతిర్గీతా యశస్వినా,
గయేన యజమానేన గయేష్వేవ పితౄన్ ప్రతి॥
— అయోధ్య 107-11

గయలో నొకప్పుడు ఒక ఘనుడు పితృయజ్ఞముచేసి తన పితృదేవతలను నరకమునుండి రక్షించెను. ఆతడిట్లు శాసించెను.

శ్లో॥ పున్నామ్నో నరకాద్యస్మిన్ పితరం త్రాయతే సుతః,
తస్మాత్ పుత్ర ఇతి ప్రోక్తః పితౄన్ యః పాతి సర్వతః॥
— అయోధ్య 107-12

ఇష్టాపూర్తమను యజ్ఞముచేసి పితరులను పున్నామ నరకమునుండి రక్షించిన వానిని పుత్రుడందురు. తండ్రికి నీవు కూడ నిష్టాపూర్త యజ్ఞముచేసి తత్ఫలమును తండ్రికి సమర్పించి 'పుత్రుడ' వనిపించుకొనుము. నీవు చెప్పినట్లు నేను తండ్రికి 'అపత్యము' నగుదును.

శ్లో॥ ఏష్టవ్యా బహవః పుత్రా గుణవంతో బహుశ్రుతాః,
తేషాం వై సమవేతానా మపి కశ్చిద్గయాం వ్రజేత్॥
— అయోధ్య 107-13

అనేకమంది కుమారులుండవలెను. వారు గుణవంతులు, వేద విదులుగ నుండవలెను. అందులో నొక్కరైనను, గయాశ్రాద్ధము చేయవలెను. అని శ్లోకార్ధము. శ్రీరాముని కాలమునాటికే గయకెంత ప్రాముఖ్య మున్నదనుసంగతి మీకు జ్ఞాపకము చేయుచున్నాను.

శ్లో॥ ఏవం రాజర్షయః సర్వే ప్రతీతా రాజనందన,
తస్మాత్త్రాహి నరశ్రేష్ఠ పితరం నరకాత్ప్రభో॥
— అయోధ్య 107-14

ఈ విధముగ నరకమునుండి రక్షింపుమని రాముడు చెప్పెను. భరతుడుమాత్రము తానెడతెగక రాముడు గొప్ప వాడనియు, రాజభోగముల ననుభవించదగిన వాడనియు, వాదించుచునే యుండెను. రాముడట్టిదేదియు లేదనియు అరణ్యమైనను తమకు సుఖప్రదముగనే యుండుననియు చెప్పెను. భరతు డనుభవించ పోవుచున్న రాజ్యముకూడ వనవాసముకంటె సుఖప్రదముకాదని తెలిపెను. ఈ విషయ మీక్రింది శ్లోకమువలన తెలియుచున్నది.

శ్లో॥ త్వం రాజా భరతభవస్వయం నరాణాం
వన్యానా మహమపి రాజరాణ్మృగాణామ్,
గచ్ఛ త్వం పురవర మద్యసంప్రహృష్టః
సం హృష్టస్త్వహ మపి దండకాన్ ప్రవేక్ష్యే॥
— అయోధ్య 107-17

మరియు నిట్లనెను.

శ్లో॥ ఛాయాన్తే దినకరభాః ప్రబాధమానం
వర్షత్రం భరత కరోతు మూర్ధ్ని శీతామ్
ఏతేషా మహామపి కానన ద్రుమాణాం
ఛాయాం తా మతిశయనీః సుఖీశ్రయిష్యే॥
— అయోధ్య 107-18

"నీవుపోయి ప్రజలకు రాజువుకమ్ము. నేనడవియందలి క్రూరమృగములకు రాజు నగుదును. నీవు సంతోషముతో నయోధ్యకేగుము. నేనత్యానందముతో నరణ్యమునకేగెదను. నేను బాధపడుదునని నీవు తలంపకుము. సూర్యాతపమునుండి శ్వేతఛత్రముక్రింద నీవు తలదాచుకొనుచుండ, నే నరణ్యావృక్షముల విశాల ఛాయలయందు సూర్యాతపమునుండి సంరక్షించుకొందును.

శ్లో॥ శత్రుఘ్నః కుశల మతిస్తు తే సహాయః
సౌమిత్రి ర్మమవిదితః ప్రధానమిత్రమ్,
చత్వార స్తనయవరా వయం నరేంద్రం,
సత్యస్థం భరత! చరామ మావిషీద॥
— అయోధ్య 107-19

నీకు బుద్ధిశాలియైన శత్రుఘ్నుడు సహాయము చేయును. నాకు లక్ష్మణుఁడు ముఖ్యస్నేహితుడు. అన్నదమ్ములము నలుగురము అన్యోన్యసహాయము చేసికొనుచు తండ్రియొక్క సత్యమును కాపాడుదము. దుఃఖింపకుమ"ని భరతుని ప్రబోధించెను.

తరువాత రెండు సర్గలలోను జాబాలి యను మహర్షి రాము నయోధ్యకు గొనిపోవుటనే పరమార్థముగా పెట్టుకొని, ధర్మవిరుద్ధముగ నాస్తికవాదము చేయును. దానికి రాముడు కోపించి అట్టిమాటలు ఋషియగువాని నోట రాకూడదనియు, దానిని తాను విమర్శించి ఖండింపని యెడల సామాన్యజనులా నాస్తికవాదమునే ధర్మముగ భావించి పతితులయ్యెదరనియు చెప్పి, ధర్మపక్షమును సిద్ధాంతీకరించెను. ఈ రెండుసర్గల నుప న్యాసములో వదలివేయు చున్నాను. ఈ రెండు సర్గలును కల్పితము లనియు, తర్వాత వీని నెవరో చేర్చిరనియు నొక ప్రవాదముకూడ కలదు. అందలి సత్యాసత్యము లెట్లున్నను కథ కేమియు మార్పురాదు. చిట్టచివరకు వశిష్ఠుడు పూనుకొని జాబాలి మహర్షి నాస్తికవాది కాడనియు, రామునియందు రాజ్యకాంక్ష అంతరాంతరములలో శేషించియున్నదేమో కనుగొనుట కతడట్లు వాదించెననియు, జాగరూకతకల రామ చంద్రుడా పరీక్షలో పడిపోక నిలచెననియు, రామునితో చెప్పెను.

అంతటితో వదలివేయక తానింకొక విధముగ వాదించెను.

శ్లో॥ ఇక్ష్వాకూణాం హి సర్వేషాం రాజా భవతి పూర్వజః,
పూర్వజేనావరః పుత్రో జ్యేష్ఠో రాజ్యేఽభిషిచ్యతే॥
— అయోధ్య 110-35

ఇక్ష్వాకు వంశమునందు రాజుపెద్దకొడుకే రాజగు చున్నాడుకదా! ప్రతిరాజు తన యనంతరము పెద్దకొడుకు

నకే రాజ్యాభిషేకము చేయుచున్నాడు. (మనువుకాలము నుండియు సూర్యవంశమునకు వశిష్ఠుడే పురోహితుడు ఇంత కాలమునుండియు వారి పట్టాభిషేకములను తానే జరిపించు చుండెను.) రాముడు దశరథునకు జ్యేష్ఠకుమారుడు అందువలన నతడేరాజ్యార్హుడని వశిష్ఠుడు వాదించెను. అంతేగాక రాముడు మెత్తనివాడు కనుక తన గురుత్వమును తెలిపి రామునికి వినిపింప నెంచెను. తండ్రికన్న గురువు గొప్పవాడు. అందు వలన నామాటవిని రాజ్యమును స్వీకరింపుము.” అనెను. కాని రాముడందులకు ఒప్పుకొనక నిట్లనెను.

శ్లో॥ యన్మాతా పితరౌవృత్తం తనయే గురుతః సదా,
న సుప్రతికరం తత్తు మాత్రా పిత్రా చ యత్కృతమ్॥
— అయోధ్య 111-9

తల్లిదండ్రులవల్ల పొందిన మేలునుండి ఎట్టి కుమారుడును ఋణవిముక్తుడు కాలేడు, తల్లిదండ్రులకన్న గురువు గొప్పవాడనుమాట నేనొప్పుకొనను.

శ్లో॥ యథా శక్తిప్రదానేన స్నాపనాచ్ఛాదనేన చ,
నిత్యం చ ప్రియవాదేన తథా సంవర్ధనేన చ॥
— అయోధ్య 111_10

శక్తినొసంగుట యందును, స్నానపానములు చేయించి ఆచ్ఛాదన చేయుటయందును, నిత్యము మంచిమాటల జెప్పుచు పెంచుట యందును, ఈ మొదలగు కర్మలచే తల్లి తండ్రులు బిడ్డలకుచేయు ఉపచారముల నెవరు కొలువగలరు? వారి ఋణమునుండి ఎవరు విముక్తులు కాగలరు?

ఇంగ్లీషుకవి "చెప్పుట కలవిగాని, జ్ఞాపకముంచుటకు వీలులేని, కృపతోడను, ప్రేమతోడను, తల్లిదండ్రులు చేసిన చిన్నచిన్న అసంఖ్యాకములగు పనులు" అనును.

శ్లో॥ సహి రాజా జనయితా పితా దశరథోమమ,
ఆజ్ఞాతం యన్మయాతస్య న తన్మిథ్యా భవిష్యతి॥
— అయోధ్య 111-11

నాతండ్రి యాజ్ఞాపించినట్లు తప్ప వేఱువిధముగ వర్తింపనని రాముడు కంఠోక్తిగా ననెను.

ఇచ్చోట వశిష్ఠుని గురించి కొంచెము చెప్పెదను. ఆతడు ధర్మమూలము. జ్ఞానము ఆతనినుండియే వచ్చెను. వేదవేదాంగములలో నాతనికి తెలియనిది లేదు. అతడు చేయని తపస్సు లేదు. స్వయముగ నాతడనేక విషయములను చేసి చూచియుండెను. అతనికన్న వయోవృద్ధులును లేరు. ధర్మపక్షమున వాదించు రామునకు తల్లి, తండ్రి, తోడబుట్టినవారు, బంధువులు, మిత్రులు, పౌరులు, జానపదులు, మంత్రిసామంతులు అందరును వ్యతిరేకముగ నుండిరి. ధర్మమూర్తియైన వశిష్ఠుడు రాముని వాదమునకు తోడుపడియుండవలసినది. కాని రాముని నతడేకాకిగనే వదలివేసెను. అతడితరులతోనే చేరిపోయెను. అంతేకాక మేనమామ యింటినుండి వచ్చినతోడనే గురువుల సమక్షమునందు భరతుని వేదవిహితముగ రాజ్యమును స్వీకరింపుమని వత్తిడిచేసెను. "తండ్రి మృతినొందెను. రాముడిచట లేడు. రాజ్యమరాజకముగ నుంచతగ"దనెను. అప్పుడు భరతుడు నిరాకరించెను.

శ్లో: విలలాప సభామధ్యే జగర్హే చ పురోహితం,
— అయోధ్య 82-10

భరతుడు సభామధ్యమున దుఃఖించెను. పురోహితుడైన వశిష్ఠుని నిందించెను. ఇంతచిన్నకుర్రవాడు వేదవేదాంగవిదుడై ధర్మమూర్తియైన వశిష్ఠుని 'జగర్హే' గర్హించుటవలన తానింతవరకును భరతుని పక్షముననే వాదించుచుండెను. అట్లుకాక "రాముడు చెప్పునదే సత్యము, ధర్మము; తండ్రియాజ్ఞవలన నతడు వనవాసమునకు పోవుటయే ధర్మము" అని వశిష్ఠుడు మొదటనే రామపక్షమున వాదించియుండిన యెడల నెట్లుండెడిదో. కాని పై కారణములవలన నాతడు చివరివరకును అట్లు చెప్పలేదు.

భరతుడు మాత్రము సామాన్యుడా! ఆతడు పన్నిన యుక్తులన్నియు తిరోధానమగుచున్నను, క్రొత్తయుక్తులను పన్నుచుండెను. ఇప్పుడింకొక క్రొత్తయెత్తు ఎత్తెను. "నా విజ్ఞాపనను నాయన్న మన్నింపలేదు. అందువలన నేను ప్రాయోపవేశము చేసెదను." ఈ సత్యాగ్రహము నీతిబద్ధమైనది. "నా సోదరుడు కనికరించి యనుమతించు వరకును, నిద్రాహారపానీయములను మాని దర్భశయ్యపై పరుండెద" నవెను.

సత్యాగ్రహమును గురించి మీరిప్పుడిప్పుడు వినుచున్నారు. రామాయణమున దాని కేగతిపట్టినదో చూడుడు. భరతుడు సుమంత్రుని పిలచి, దర్భశయన మమర్చు మనును. సుమంత్రుడు వశిష్ఠునివలెనే వయోవృద్ధుడు. ఆతడు వెంటనే దర్భలకుపోక రామునివంకకు చూచెను. రాముడతనివంక

కన్నెత్తిచూడలేదు. రాముని యనుజ్ఞ లేనందువలన సుమంత్రుడు దర్భలను తేలేదు. భరతుడే స్వయముగ దర్భలను తెచ్చుకొని పఱచుకొని పరుండి రామునితో "నిప్పుడేమి చెప్పెదవు?" అనెను. రాముడు భరతునితో "నీవు చేయుచున్న దధర్మము. బ్రాహ్మణులు తమ ద్రవ్యము పోయినప్పుడు రాబట్టుకొనుటకు ప్రాయోపవేశము చేయుదురు. పరాక్రమవంతులైన క్షత్రియులు ప్రాయోపవేశమున కర్హులు కారు."

శ్లో॥ బ్రాహ్మణో హ్యేకపార్శ్వేన నరాన్రోద్ధు మిహార్హతి,
నతు మూర్ధాభిషిక్తానాం విధిః ప్రత్యుపవేశనే॥

— అయోధ్య 111-17

మూర్ధాభిషిక్తులైనవారు ప్రాయోపవేశము చేయతగదనెను. అయితే ఇక్కడ నొక సంశయము వచ్చుచున్నది. యుద్ధకాండలో సముద్రమునకు వారధి కట్టవలసి వచ్చెను. వానరులు తెచ్చిన రాళ్లు సముద్రమున మునిగిపోవుచుండెను. అప్పుడు రాము డేమిచేసెను? ఆతడు తాను భరతునకు బోధించిన విషయమును మరచిపోయెనా?

మరచినట్లే యున్నది. క్షత్రియుడై తాను చేయకూడని ప్రాయోపవేశము చేసి భరతు డపజయమునే పొందెను. అట్లే రాముని ప్రాయోపవేశము వలన సముద్రరాజు చలింపలేదు. రాముడు క్షాత్రము నవలంబించక తప్పలేదు. మూడు దివారాత్రములు రాము డుపవసించెను. నిద్రమానెను, ఆందోళన చెందెను. సముద్రుడు దర్శనమైన నీయ

లేదు. అప్పుడు రాముడు ప్రాయోపవేశమును విసర్జించి వింట బాణమును సంధించెను. ఆ ఒక్క బాణముతోనే సముద్రజలములనెల్ల నింకింపెదననెను. అప్పుడు సముద్రుడు గజగజలాడుచు నెదుటనిలచెను. చూచితిరా! పరాక్రమమునకు జయము కలిగినది. రామాయణమున నింకొక చోట ప్రాయోపవేశ ప్రశంస ఉన్నది. సుగ్రీవుడు సీతాన్వేషణకై వానరుల నియమించెను. ఒక నెలలో సీతవృత్తాంతము లేకుండ తిరిగి వచ్చినవారినెల్ల వధింతుననెను. గడువు సమీపించెను. వారు వెదకవలసినచోటెల్ల వెదకిరి. విసిగి వేసారిరి. చేయునది లేక నంగదుని యాజమాన్యమున వారందరును ప్రాయోపవేశము చేయదలచిరి. సుగ్రీవుని చేతిలో మరణశిక్ష నొందుట కన్న నిట్లు మరణించుటయే మంచిదని వారు తలంచిరి. అంగదునకు ప్రాయోపవేశమున మిక్కిలి ప్రీతియున్నట్లున్నది. కాని ఇంతలో జటాయువునకన్నయగు సంపాతి తన యెదుట మరణింపబోవుచున్న వానరసమూహమును చూచెను. అతని రెక్కలు కాలిపోయెను. అతని కాకలి దహించుకొని పోవుచుండెను. ఈ వానరులందరు మరణించినయెడల తనకు చిరకాల మాహారము లభించునని సంతోషించెను. ఇంతలోనే జటాయువు ప్రశంస వచ్చినది. దానితో ప్రాయోపవేశము విరమించిరి.

హనుమంతుడు కూడ యెంత దూరము వెదకినను సీత కన్పించకపోగా

శ్లో॥ అదృష్ట్వా కిం ప్రవక్ష్యామి తా మహం జనకాత్మజామ్,
ధ్రువం ప్రాయ ముపైష్యంతి కాలస్య వ్యతివర్తనే॥
— సుందర 12-8

రామాయణమునందు ప్రాయోపవేశ ప్రశంస యున్నది. కాని ప్రతిసందర్భమున ప్రాయోపవేశ మపజయము నేపొందెను.

తిరిగి మనకథను వత్తము : రాముడు ప్రాయోపవేశమున కసమ్మతిని తెలిపెను. భరతుడు వెంటనే లేవలేదు. అయోధ్యాపురవాసులవంక జూచి "మా అన్న గట్టిపట్టు పట్టినాడుకదా! మీరేల మాటాడరు?" అనెను. వారు రాముని ప్రత్యాగమనమును వాంఛించువారే అయినను రాముని వాదమునందలి ధర్మము వారికి నచ్చెను. రాముని రమ్మని కోరుటకు వారు సాహసింపరైరి. వారైక్యకంఠ్యముగ "మీయన్న చేయు వాదమే ధర్మముగ తోచుచున్నది. మేమేమి చేయగల" మనిరి. అప్పుడు రాముడు భరతునితో "తమ్ముడా! చూచినావుకదా! నీ ప్రజలకైనను నీ వాదము నచ్చలేదు. వారు నిన్ను వదలివేసిరి. చేయకూడని ప్రాయోపవేశము చేయ నెంచితివి. కాన నీవు ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. లేచి యాచమనమును చేసి, నన్ను కౌగలించుకొనుము. దానితో నీవు పరిశుద్ధుడ వగుదువు." అనెను. భరతుడట్లే ప్రాయోపవేశమును వదలివేసెను. అంతటితో భరతుడింకొక యుక్తిని పన్నెను. "మనతండ్రి యొకరిని రాజ్యమును చేయు మనెను. రెండవవారిని వనవాసమునకు పొమ్మనెను. సరే, బాగున్నది. నేను నీకు ప్రతినిధినై వనవాసము చేసెద. నీవు నాకు ప్రతినిధివై రాజ్యమేలు" మనెను.

శ్లో॥ యది త్వవశ్యం వస్తవ్యం కర్తవ్యం చ పితుర్వచః.
అహమేవ నివత్స్యామి చతుర్దశ సమా వనే॥

— అయోధ్యా 111-26

"పదునాలుగు సంవత్సరములు నేనీదండకారణ్యమున గడిపెదను. నీవేల గడుపవలె" ననెను. ఇందుకు రాముడు భరతునకు జవాబుచెప్పక సమావిష్టులగు సభ్యులను జూచెను.

శ్లో॥ విక్రీత మాహితం క్రీతం యత్పిత్రా జీవతామమ,
న తల్లోపయితుం శక్యం మయా వా భరతేన వా॥

— అయోధ్య 111-28

జీవించియుండగ మనతండ్రి చేసిన క్రయవిక్రయాదులు నాకుగాని భరతునకుగాని ఉల్లంఘింపరానివి. అట్లు చేసిన యెడల మన మవమానమునకు గురియగుదుము.

మహాజనులారా! బిడ్డలు 'మైనర్లు'గా ఉన్నపుడు తండ్రి చేసిన క్రయవిక్రయాదులను గురించి కోర్టులకెక్కి వాదులాడు మెజారటీ యందుకొనిన కుమారల చరిత్రలు మనము చూచు చున్నాము. అంతేకాదు, తాము చేసిన క్రయవిక్రయములను గురించి తాము బ్రతికియుండగనే తన మైనరు కుమారులచే వ్యాజ్యము వేయించెదమని బెదిరించు దుర్మార్గులైన తండ్రు లనుకూడ నెరుగుదుము. అట్లే తన తండ్రి యప్రయోజకుడని వ్యాజ్యము వేసిన లాభించునని కుమారులకు బోధించి తగవు లలో దింపు దుర్మార్గుడైన తండ్రినికూడ చూచుచునే యుందుము.

ఇక్కడ రాముడు తండ్రియాజ్ఞ యందలి ఉపాధి పరివర్తనకు కూడ నొప్పుకోలేదు.

శ్లో॥ ఉపాధి ర్నమయా కార్యో వన వాసో జుగుప్సితః।

అని ముక్తకంఠముతో పలికిరి.

అంతతో పోక కైకేయి చేసినదే ధర్మమని రాముడు నిరూపింపబోవుచున్నాడు.

శ్లో॥ యుక్తముక్తం చ కైకేయ్యా పితా మే సుకృతం కృతమ్.
—అయోధ్య 111-29

కైక చేసినదే ధర్మము. అందువలన మన తండ్రి సుకృతమును చెందుచున్నాడు.

శ్లో॥ వృత్తో రాజా హి కైకేయ్యా మయా తద్వచనం కృతమ్,
అనృతా న్మోచయానేన పితరం తం మహీపతిమ్
— అయోధ్య 111-[illegible]

మహారాజైన మనతండ్రి వచనమును నిర్వర్తించి తండ్రిని అనృతపాపమునుండి నేను రక్షించితిని. అట్లే రా[illegible] కైకఋణమునుండి విముక్తిని పొందెను.

ఇట్లు చెప్పి రాముడు ఊరకుండెను. తత్సమావేశమున నుపవిష్టులైన మహర్షులును, దేవతలును ఈ[illegible] చెప్పిరి. "రాముడు ఈదినము సరియైనపని చేసెను. [illegible] వలన దశరథుని నరకమునుండి రక్షించెను. [illegible] స్వర్గమునందున్నాడు. ఎంతో దుర్ఘటమైన తన తండ్రి [illegible] నెరవేర్చి రాముడు కృతకృత్యుడైనాడు. అందువలన [illegible] తండ్రి కైకఋణమునుండి విముక్తిని పొందెను. [illegible] నీవు రాముని అయోధ్యకు పొమ్మనుచున్నావు. అందువలన స్వర్గమందున్న నీతండ్రి పతితుడగును."

ఈ తీర్మానముతో భరతుని వాదము [illegible]. కాని అతడు నిరుత్తరుడు కాలేదు. అతడు రాముని [illegible]

ములపైబడి వాటిని గట్టిగ పట్టుకొని ఇట్లు ప్రార్థించెను. "అన్నా! ప్రజలందరును రాముడే తమకు రాజు కావలెనని తలంచుచుండిరి. నేను వాదములో నోడిపోతిని. నేను శుద్ధ తెలివితక్కువవాడను. నా ఆజ్ఞ నెవరును పాలింపరు. నేను రాజ్యమెట్లు చేయగలను?"

శ్లో॥ రక్షితుం సుమహద్రాజ్య మహ మేకస్తు నోత్సహే,
పౌరజానపదాంశ్చాపి రక్తాన్ రంజయితుం తథా॥
— అయోధ్య 112-11

ఈ మహారాజ్యమును నేను రక్షింపజాలను. ఈపౌర జానపదులను కాని, మంత్రిసామంతులను కాని, రక్తబంధువులను కాని నేను రంజింపజాలను.

శ్లో॥ త్వా మేవహి ప్రతీక్షంతే పర్జన్యామివ కర్షకాః,
— అయోధ్య 112-12

భూమి యెండి బీటలు వారినది. అప్పుడు కర్షకులు వర్షాగమనమును కాంక్షించినట్లు ప్రజలు నీ ఆగమనమును కాంక్షించుచున్నారు.

శ్లో॥ ఇదం రాజ్యం మహాప్రాజ్ఞ స్థాపయ ప్రతిపద్య హి,
శక్తిమా నసి కాకుత్స్థ! లోకస్య పరిపాలనే॥
— అయోధ్య 112-13.

"మహాప్రాజ్ఞుడవైన రామచంద్రా! నీవు (అయోధ్యా రాజ్యము నేకాదు) లోకమంతయు బాలింప సమర్థుడవు. కనుక నీ రాజ్యమును పరిపాలింపుము." అనుచున్నాడు. ఒక వ్యాఖ్యాత దీనికిట్లర్థము చెప్పెను. "రామచంద్రా! ఈ

రాజ్యము నీది. నీవు దీనిని స్వీకరించి సమర్థుడైనవానిచేత పరిపాలింపజేసికొమ్ము. అతడు నీయాజ్ఞకు లోబడి పాలించును." అనెను. అందుకు రాముడు సంతోషించి యిట్లనెను.

శ్లో॥ ఆగతా త్వా మియం బుద్ధిః స్వజా వైనయికీ చ యా,
భృశముత్సహసే తాత రక్షితుం పృథివీ మపి ॥
— అయోధ్య 112-16.

"నాయనా! నీవీవిధముగ నొడంబడినందున నీ సామర్థ్యము ఋజువైనది. అందువలననే నీవు రాజార్హుడవని తేలినది.

శ్లో॥ అమాత్యైశ్చ సుహృద్భిశ్చ బుద్ధిమద్భిశ్చ మన్త్రిభిః,
సర్వకార్యాణి సంమంత్ర్యం సుమహాన్త్యపి కారయ ॥
— అయోధ్య 112-17.

"నీవు ప్రధానమంత్రులతోను, స్నేహితులతోను, బుద్ధిమంతులైన ఇతర మంత్రులతోను లెస్సగ సంప్రదించి గొప్పపనులు నిర్వర్తించుచుండుము.

శ్లో॥ లక్ష్మీశ్చన్ద్రా దపేయాద్వా హిమవాన్వా హిమంత్యజేత్
అతీయాత్సాగరో వేలాం న ప్రతిజ్ఞామహం పితుః ।
— అయోధ్య 112-18.

ఈ శ్లోకమున కర్థమును తొమ్మిదవ ఉపన్యాసములో నుదహరించి యున్నాను. తరువాత రాముడు కైకవిషయము నెత్తుకొనెను. "కైక చేసినది తప్పైనను ఒప్పైనను ఆమె నీకు తల్లి. ఆమెను సత్పుత్రుడు తల్లిని చూచినట్లే చూడుము" చూచితిరా! రాముని యౌదార్యము. తనకుమారునకు రాముడు విరోధియని ఆమె అనుకొని అతనిని వనవాసమున

కంపెను. వనవాసమున రాముడు మృతినొందునని నామె యాశించి యుండవచ్చును. అట్టి కైకను జాగ్రత్తగ రక్షించు మని రాముడీక్రింది శ్లోకముతో శాసించు చున్నాడు:—

శ్లో॥ మాతరం రక్ష కైకేయీం మారోషం కురు తాం ప్రతి,
మయా చ సీతయా చైవ శప్తో సి రఘునన్దన॥
— అయోధ్య 112-27, 28.

వెంటనే ఇంకొక అద్భుత సంఘటన జరిగినది. శ్రీరాముడు సమ్మతించిన యెడల చిత్రకూటమునందే రామ పట్టాభిషేకము చేయుటకు భరతుడు సంకల్పించెను. తన వెంట సర్వసంభారములు తెచ్చెను. అందు పాదుకలును గలవు. పట్టాభిషేకకాలమున రాముడు ధరించుటకు సువర్ణ ఖచితమైన ఆపాదుకలను భరతుడు అప్పుడు బయటపెట్టెను. వశిష్ఠుని ప్రోత్సాహమున భరతుడు పాదుకలపై నొకక్షణము నిలుచుండుమని రాముని కోరెను. రాముడట్లే చేసెను. రాముని దివ్యశక్తులు పాదుకలయందు ప్రవేశించినట్లు చెప్పి కొనిరి. భరతు డాపాదుకలను రాముని స్థానమున స్వీకరించెను. ఆపాదుకలే రాజుగ తాను ప్రతినిధిగ నతడు రాజ్యమును పాలించెను. అచటనే భరతుడు వానిని శిరస్సున ధరించెను. సుందరమైన ఈపాదుకల పట్టాభిషేకము భరతున కెట్లర్థమయ్యెనో 115 వ సర్గయందు గోచరించును.

శ్లో॥ ఏతద్రాజ్యం మమ భ్రాత్రా దత్తం సంన్యాసవత్స్వయమ్,
యోగక్షేమవహే తస్య పాదుకే హేమభూషితే।
— అయోధ్య 115-14.

"ఇప్పటికిని రాముడే రాజు. ఆ రాజ్యము నాతడు న్యసించి నాయందుంచెను. ఆరాజ్యముయొక్క యోగక్షేమము లను హేమభూషితమైన నీపాదుకలయందుంచి పాలించెదను.

శ్లో॥ భరతః శిరసా కృత్వా సన్న్యాసం పాదుకే తతః,
అబ్రవీత్ దుఃఖసంతప్తః సర్వం ప్రకృతి మండలమ్॥

శ్లో॥ ఛత్రం ధారయత క్షిప్ర మార్యపాదావిమౌ మతౌ,
ఆభ్యాం రాజ్యే స్థితో ధర్మః పాదుకాభ్యాం గురోర్మమ॥
— అయోధ్య 115-15, 16.

భరతు డాపాదుకలను శిరస్సున ధరించి వానియందే రాజ్యశ్రీని న్యసించినవాడై పౌరజానపదులతో నిట్లనెను. "ఈపాదుకలకు సితఛత్రముల బట్టుడు. ఇవే రాముని పాదుకలు. ఈపాదుకలే రాజ్యమున ధర్మరక్షణ చేయు" ననెను.

శ్లో॥ తత స్తు భరతః శ్రీమా నభిషించార్య పాదుకే,
తదధీన స్తదా రాజ్యం కారయామాస సర్వదా.
— అయోధ్య 115-26.

శ్రీమంతుడైన భరతుడావిధముగ పాదుకలకు పట్టాభిషేకముచేసి యెల్లప్పుడు వానిని సేవించుచు రాజ్యముచేసెను.

శ్లో॥ యదాహి యత్కార్య ముపైతి కించిత్
ఉపాయనం చోపహృతం మహార్హమ్,
సపాదుకాభ్యాం ప్రథమం నివేద్య
చకార పశ్చా ద్భరతో యథావత్॥
— అయోధ్య 115-27

"ఆ పాదుకలకు ముందుగ తెలిపిగాని ఏపనియు చేయడు. ఏ బహుమతి వచ్చినను వానిని పాదుకలకు సమర్పించిగాని స్వీకరింపడు." ఈవిధముగ నతడు తనరాజ్యమును పరిపాలించెను. ఈ తీవ్రవివాద మావిధముగ పరిష్కారమైనది. ఇందులో నోడిన దెవరు? జయించిన దెవరు? ఇద్దరు జయించిరి. ఇద్దరు ఓడిరి. భరతుడు రాముని నరణ్యములోనే వదలి తిరిగిపోవలసి వచ్చెను. కైకేయి రాముడరణ్యమునకు పోవుననియు భరతుడే రాజగుననియు తలంచెను. దశరథుడును, తక్కుంగల సర్వజనులును భరతుడే రాజగునని తలంచిరి. కాని భరతుడు రాముని ప్రతినిధిగ మాత్రమే రాజాయెను. రాముడు పదునాలుగేండ్లు వనవాసము చేయుటచేత రాముని ప్రజలు విస్మరింతురనియు శాశ్వతముగ భరతుడే రాజగుననియు మంథర కైకకు బోధించెను. అత్యంత సుందరమైనది సీత. ఆమెను పరాక్రమవంతు డెవడైనను అపహరింపవచ్చును. అప్పుడు రాముడూరుకొనడు. పెద్దయుద్ధము జరుగును. అందు రామలక్ష్మణులు మరణింతురనియు, తిరిగివచ్చుట నూటికి తొంబది తొమ్మిది పాళ్లు కల్లయనియు నాటి ప్రజలందరు ఊహించిరి.

భరతుడు తనశక్తి నంతయు ధారపోసి తానసలే రాజుకాకుండా చేసికొనెను. రాముడు వాచా ఒప్పుకొనక పోయినను మౌనముగ నంగీకరించినట్లు అయోధ్యకు రాముడే రాజుగ భరతుడు స్వీకరించెను. ఈ విధముగ క్రియలో రాముడు జయించినను న్యాయముగ భరతుడే జయించినట్లాయెను. భరతుడు పదునాలుగు వత్సరములు సమర్థతతోను సాహసముతోను, ప్రజ్ఞతోను, జాగరూకతతోను రాజ్య

పాలనము చేసెను. దీని కంతకును మూలము రామపాదుక లనియే ప్రజలు నమ్మియుండిరి.

ప్రసిద్ధమైన ఈఘట్ట మింతటితో ముగిసినది. ఈఘట్ట మంతయు జ్ఞానవర్ధకమై యున్నది. అవకాశమున్న వారెల్ల రను చిత్రకూటాశ్రమమునందు నడచిన ఈ దివ్యఘట్టమును, అందలి సుందరమైన శ్లోకపంక్తులను చదువగోరుచున్నాను. వాల్మీకి ఇతర ఘట్టములందువలెకాక ఈ ఘట్టమునందు ఎంతో నిగ్రహముగ, ఏకాగ్రచిత్తముతో, అతిసమర్థతతో ఈ శ్లోక పంక్తుల నమర్చెను. జ్ఞానదాయకమైన విషయముల నిందు నిక్షేపించెను. మిగిలిన భాగములందువలె నిందుపమాది యలంకారములతో వర్ణనలు చేయలేదు. అంతేకాక పున రుక్తులు చాల తక్కువగ నున్నవి. ఇందలి భాషయు, విషయ మును, మిక్కిలి సొసగి పొందియున్నవి. అందువలననే ప్రతి పంక్తియు సుందరముగ నున్నది. మన హృదయమును, జీవితమునుకూడ పరమ పవిత్రము చేయగలిగి యున్నవి. అందువలననే మరల మరల ఈ ఘట్టములను మిమ్ములను చదువగోరుచున్నాను.

శ్రీ రామచంద్రార్పణమస్తు.

—♦—



జానకిరాం ప్రెస్, తెనాలి.

# సాధన గ్రంథ మండలి ప్రచురణలు

| | |
|---|---|
| అష్టాదశ శ్లోకగీతవ్యాఖ్య | 0-12-0 |
| అరిపంచకము | 0-12-0 |
| * ఆశ్వినమాహాత్మ్యము | 2-0-0 |
| ఈశ్వర సాక్షాత్కారము | 0-3-0 |
| ఉపాసనీబాబా జీవితము | 1-8-0 |
| కల్యాణకుంజము | 1-4-0 |
| గురుశిష్యులు (శ్రీరామకృష్ణవివేకానందులు) | 1-0-0 |
| గీతాప్రతిభ (2వ కూర్పు) | 0-12-0 |
| గీతాకదంబము 1వ దళము | 1-4-0 |
| ,, 2వ దళము | 1-4-0 |
| గోవిందదామోదరస్తోత్రం | 0-8-0 |
| జడభరతుడు | 0-12-0 |
| * నరసదాసు కీర్తనలు | 0-10-0 |
| పరమసాధన (2వ కూర్పు) | 0-12-0 |
| పరమార్థతత్త్వము | 0-12-0 |
| పద్మపురాణం (ఆదిఖండం) | 1-8-0 |
| ,, (భూమిఖండము) | 2-0-0 |
| ,, (బ్రహ్మఖండము) | 1-0-0 |
| బదరీయాత్ర (2వ కూర్పు) | 1-0-0 |
| భగవత్ప్రాప్తి-ఉపాయములు | 0-4-0 |
| భక్తితత్త్వము | 0-12-0 |
| భక్తిరసాయనము | 2-0-0 |
| భారతీయతత్త్వశాస్త్రము | 2-0-0 |
| భాగవతం భా 2,3,4,5 భా 1కి | 2-0-0 |
| భారతీయదర్శనం (ప్ర.ఖం) | 1-8-0 |
| మానవధర్మము | 1-0-0 |
| ముక్తిగీత | 0-6-0 |
| రాధారహస్యము (40 గ్రంథముల సారము) | 1-4-0 |
| * శంకర గ్రంథ రత్నావళి | 3-0-0 |
| * శ్రీరామపూజా విధానము | 0-4-0 |
| శ్రీకాళహస్తీశ్వరశతకము | 0-8-0 |
| శ్రీ సీతారామ శతకము | 0-2-0 |
| శ్రీ త్యాగరాజ చరిత్ర | 0-4-0 |
| * శ్రీరామనామ ప్రభావము | 0-6-0 |
| శ్రీశుకుడు | 0-12-0 |
| శ్రీత్రిపురాంతకేశ్వరశతకం | 0-4-0 |
| సప్తమహావ్రతములు | 0-6-0 |
| సిద్ధాంత కల్పవల్లి | 1-0-0 |
| సంకీర్తన మీమాంస | 1-0-0 |
| హరినామ మహిమశతకము | 0-4-0 |
| హిందూకోడ్ బిల్ సమీక్ష | 1-0-0 |
| భగవద్గీత (మూలంశుద్ధప్రతి) | 0-6-0 |
| అష్టాదశశ్లోకగీత (12 ప్రతులు 1-0-0) | 0-2-0 |
| తులసీ - గోపూజ | 0-3-0 |
| ధ్యానపద్ధతి | 0-8-0 |
| భగవన్నామసంకీర్తనము | 0-2-0 |

* ఈ గుర్తుగలవి గాక, మిగతా గ్రంథము లన్నియు ఒకసెట్టు తీసికొనిన సగముధరకే యివ్వబడును. ముందుగ రు. 10/-లు అడ్వాన్సు పంపాలి. మీరు ఆర్డరు యిచ్చునప్పటికి ఉన్న గ్రంథములే పంపబడును. వి. పి. తీసికొన ప్రార్థన.

ప్రతులకు:- సాధన గ్రంథమండలి, తెనాలి.